శ్రీరస్తు.

# మంగళహారతుల శతకము

ఇయ్యది

శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబచే

రచియింపఁబడినది.




కాకినాడ,

శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాలను ముద్రింపఁబడియె

1909.




శ్రీరస్తు.

# మంగళహారతులశతకము.

(1)

హిందూస్థానీ కాఫీ రాగము—రూపకతాళము.

(హేదేవీ! శారదాసరోరుహేక్షణా!, వలె)

శ్రీగౌరీ! సేవకాఖిలామరాళి! హారతియిదే, కూరిమిఁగొను॥

1. కారుణ్యాకారిణీ! భయాపహారిణీ! నేరనేనినుఁ జేరి వేడఁగా ... శ్రీగౌరీ॥
2. కళ్యాణీ! కామితార్థదాయినీ! జగ, త్కారణీ! యిదే కరుణతోఁడుత ... శ్రీగౌరీ॥
3. హేదేవీ! యీడితేంఘ్రి పంకజద్వయీ! సాధుపోషణీ! యాదరంబుతో ... శ్రీగౌరీ॥
4. రుద్రాణీ! లోకపావనీ! భవానీ! నా, లోపమెంచకే, ప్రాపుసేరితి ... శ్రీగౌరీ॥
5. శర్వాణీ! సజ్జనాత్మవాసినీ! వర, సాంబకావనీ! జాలమేలనే ... శ్రీగౌరీ॥

కేదారరాగము—ఆదితాళము.

(శ్రీదయేదయాదయాదయా ! హృదయనిర్దయతగదయ, వలె)

హారతి, సతీ! ధృతిమతీ! యఖిలజగదవనమతి! హా॥
నేరిమిమీరఁ జేరివేడఁగనేరన పారకృపారసనిధి! గొను హా॥

1. దాసహృదయని, వాసిని! రహిని, డాసితినినీను, భాసుర దయను, దోసమెంచి రోసితంచునాపయి రోసంబు కాసంత వాసింపఁ జేయక హా॥

2. దేవి! నిరంతర, కోవిదవినుత, భావుకమయిన, తావకపదము, శ్రీవిలాస సంగతంబనుచునే, నేవేళ భావించి సేవించుట మరువ హా॥

3. పంబినభక్తిహృ, దంబురుహమున, నింబడరనని, శంబుఁ గొలుతును, సాంబశివునిరాణి! లోకపావని! యంబా! జగదంబా! నరసాంబావినుతపాద! హా॥

(3)

జంఝూటిరాగము—రూపకతాళము.

(కహొ, అజయేసమాజమ్మాబకళ్యాంబులాళియా, వలె)

హారతిసతీ! భవానియంబ! నీకిదే, జయహారతి, జయహారతి సతీ! భవాని! యంబ! నీకిదే జయహా॥

1. సదామదిగాముదానసేవ, సల్పెదగాసుమా! జయహా॥

2. మునీంద్రహృద్విహారిణీ! ప్రమోదకారణీ! జయహా॥

3. భయాపహారిణీ! కృపాళో, భక్తవాసినీ! జయహా॥

4. సతతక్రియా! వితతదయా, మతినిజూడుమా! జయహా॥
5. అశేషదోషకలితనార, సాంబికావనీ! జయహా॥

(4)

జంఝూటిరాగము—ఏకతాళము.

(స్మరహర! శివ! శంకర! భో, శేశవ! జగదీశా!, వలె)

పశుపతిసతి! హారతిదే, పాయనిదయజూడు పశు॥

1. సుజనహృదయకంజవాసినీ! సురగణనుతపాదా! కుజన
నికరదూరా! సం, కోచమేలతల్లీ! పశు॥
2. దాసతమఃపటలహరణ! ధన్యగుణాభరణ! నీసమానలేరీ ?
సద, నీకవంద్య! గౌరీ! పశు॥
3. నిరతసదాచరణదీక్షా! నిర్మలజనపక్షా! భరితదయావక్షా!
యో, నరసమాంబారక్షా! పశు॥

(5)

సురటరాగము—ఆదితాళము.

(వందనమొనరింతుగా సభికులడెందములలరగను, వలె)

మంగళహారతిదే సదాశివు, నంగన! గొనఁగదవే!

1. పొంగుచునేనీ, బంగరుపదముల, కుంగడుభక్తినో, సంగెద,
దయతో మం॥
2. శ్రితజనహృదయ, స్థితమగునీస, దతులితపాద, ద్వితయం
బునకును మం॥
3. నతజనకలుషవి, నాశనకరణని, శితమగునీపా, దతలంబు
నకును మం॥

4. సకలభువనపా, లకతాగుణచణ, ప్రకటమయిన నీపాదం
బునకును మం॥

5. కరుణానిలయా! నరసాంబా స, చ్చరణంబగు నీ, చరణం
బునకును మం॥

(6)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(సత్యనారాయణ! సుగుణా శ్రీసత్యనారాయణసుగుణా!, వలె)

మంగళహారతిఁగొనుమా! శ్రీ, మంగళహారతిఁగొనుమా!

1. మహితమహిమశోభితదయా, మయా! మనోజవిరోధిప్రియా
జితపాపభయా! శ్రితహృన్నిలయా! మం॥

2. కుజననికరభంజనఘృణా, గుణా! పదానతప్రమదగణా!
భృతలోకగణా! కరుణాభర[illegible]! మం॥

3. కలితభువనపాలనరతా! క్షతాఘన[illegible]యుతదైత్యయుతా!
విబుధాతినుతా నరసాంబానతా! మం॥

(7)

హిందూస్థానితోడీరాగము—రూపకతాళము.

(వీరరాఘవా! నా వెతలఁబాపరా!, వలె)

మంగళారతి శుభాంగి! గైకొను, రంగనిరాణీ! యోసర్వమం
గళా! దయ మం॥

1. భక్తపాలినీ! తల్లీ! ముక్తిదాయినీ! శక్తిహీననైననేనా,
సక్తితోనిడు మం॥

2. ఎల్లవేళల, తల్లీ! యుల్లమేనురా, జిల్లఁగొల్తునీదుపాద,
పల్లవంబుల మం॥
3. దురితశోషణి! తల్లీ! కరుణాభూషణి! నరసమాంబికాద
క్షిణ కరమునందలి మం॥

(8)

ముఖారిరాగము—ఏకతాళము.

(అయ్యా! పసిఁడిలేడి, సేనాడెదదానిగూడి, వలె)

అమ్మా! శివునికొమ్మా! జయహారతిదెగొమ్మా! అమ్మా॥
1. నిన్నేనమ్మినాను, ప్రి, పన్నావనీ! నేను అ॥
2. దోసిలొగ్గియుంటి, నా, యాసదీర్పుమంటి అ॥
3. నతాదిత్య! తల్లీ! శ్రిత, వితానసురవల్లీ! అ॥
4. కనంగదేగారీ! నినువిన్నాదిగ్కేరీ అ॥
5. అంబా! కరుణార్ద్రా? నర, సాంబావినుతపాదా! అ॥

(9)

కాంభోజిరాగము—ఆదితాళము.

(దండముఁబెట్టేరా కల్యాణీ, దండాయుధపాణీ, వలె)

మంగళహారతిదేకళ్యాణీ! గంగాధరురాణీ! మం॥
1. దాసమానసాంబుజనిలయా! పేం, దారుమందారమా!
తల్లీ! శ్రీసదాశివార్ధాంగి! లోక, సేవ్యమైన నీపాదమునకు॥
2. భసితపాపసంచయయుతమై, శ్రీ, భక్తత్రాణప్రావీణ్యంబై,
మిసిమిమీరలోకములకు మేలుసేయునీపాదములకు మం॥

3. భూరిదోషపూరితననుచు, న, న్నీరీతిగవీడఁదగునే, నార
   సాంబికాఖిలశరణ్యంబులైన నీపాదములకు మం॥

## (10)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(ఓడఁగసాగరయుద్దిష్టుసుండప్పుడు, వలె)

మంగళారతిని గ, నుంగొనుజననీ! మారసంహారుని
గూరిమిసతిదయ మం॥

1. అకుయకరుణాక, టాకుములనుగడు, వీక్షింపఁగదేమోకు
   పరిదాయినీ! మం॥
2. మునుపడి పావి, త్రిని నీమ్మంతినిఁ, గనిమనిచిన యా, య
   నుకంపనిదే మం॥
3. నిరుపమ మంగళ, కరవరతావక, గురుకరుణాన్విత, నర
   సాంబికానుతా! మం॥

## (11)

హిందూస్థానితోడీరాగము—ఆదితాళము.

(పూనెవాలామురతాహజనీ, వలె)

హారతిదేగొనవె! జననీ! హారతిదేగొనవే! జననీ! హా॥

1. కన్నతల్లీ! నినుఁగాకితరంబే, నెన్నఁడుదిక్కను, కొన్నానే॥
2. రంగత్కృపాబ్ధీ! వెంగలినగున, న్నుంగనకుంటత, గుంగాదే॥
3. భరితగుణా! నీ, పదములనే, నేఁ, బట్టితినరసాం, బాపాలా॥

(12)

జంఝూటిరాగము—ఆదితాళము.

(రారా శ్రీహరి రాజితజనకా! నలుగుకువేగమే, వలె)

హారతిఁగొనుమగజాత! గజాననుజననీ! శుభ హా॥

నారాయణీ! వం, దనపూర్వకముగఁ గొనుమని వేఁడెద హా॥

1. తల్లీ! శ్రితసుర, వల్లీ! కడుశోభిల్లెడునీదయ, మొల్లముగ
నాపైఁజల్లుచునో సం, ఫుల్లాబ్జనయన! హా॥

2 కూరిమికడు, మీరనీపదనీరేజమ్ములఁ, జేరికొల్తునోగౌరి!
పశుపతినారీ! దయ జయ హా॥

3. సీమంతిని, సుమ - తీమ్ణో[illegible]గునా - సీమంతజనులఁ - బ్రే
మంబున ము - న్నోమినజననీ - కామితములొసఁగి హా॥

4. లోకానీకములఁ - బ్రాకటదయతోఁ - జేకొనిప్రోవఁగ -
నేకడనునీవే - గాకితపలుకల - రేకరుణానిధి! హా॥

5. అంబా! సుగుణక - దంబా! భక్తహృ - దంబుజవాసిని!
యింబడరనర- సాంబానుతపా- దాంబుజయుగ! శుభ హా॥

(13)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(నలుగిడుకోరజలజాతనయనచేతి, వలె)

హారతిగొనుమిదె, గౌరీ! పురారినారీ! హా॥

వారనిభక్తినినుఁ జేరియొసఁగితిని హా॥

1. పసుపులదొసగుల - వెసనారఁజేయుతల్లీ! పసుపుల ...
అసమానకరుణనీ - పసిబాలచేతిజయ హా॥

2. దురితదూరతకు నీ - చరణారుణాబ్జముల - దురిత ...
దరిఁజేరితినికని - కరమూనిమంగళ హా॥

3. నినుఁగోరికొల్చువారి - మనములానందవార్ధి - నినుఁగో...
మునుగంగఁజేయునట్టి - ఘనశక్తిగలశక్తి! హా॥

4. సకలలోకమాత! నీ - యకలంకసేవనంబే - సకలలోక...
నే, నొకటనేమరకుండ - నికనైనఁగరుణించి హా॥

5. గురుకరుణావాలమా! పరమాదరంబుతోడ - గురుక ...
నిరతంబుసేవకిని - నరసాంబనేలుతల్లీ! హా॥

(14)

శంకరాభరణమురాగము—ఆదితాళము.

(పరిపాలింపవె! భారతి, వలె)

అవలోకింపవెహారతి! శివురాణీ! కళ్యాణీ! వేదయ నవ॥

1. భువనావనసం - భూతాతి - నసనాతీ - తవరాస్థా! యిదె॥

2. సన్నుతపాదా! జాగేలే - నిన్నే నెరనమ్మితినేచాల నవ॥

3. సారాచారణి! శర్వాణీ! నారసాంబికారక్షకి యవ॥

(15)

మాయామాళవిగౌళరాగము—ఆదితాళము.

(పూలుగోతాముర రాణీ! ఓపూఁబోఁడులారా!, వలె)

హారతిఁగొనఁగదే! ఓమారతిరోహితుఁగూరిమి తరుణి! హా॥

1. వారనిభక్తచ - కోరజ్యోత్స్న! పుర - వైరిశివునర్ధ - శరీ
రిణిదయ హా॥

2. ముదమగువరస - ద్వదననివాస - పదవిఁబొదలువా - క్స్న
దతీ! సదయమతి !॥ హారతిఁగొనఁగదే, ఓవారిజజుసతి!
ధీరతి! భారతి! హా॥

3. ఆశ్రితదారి - ద్ర్యాంబుదమారుత - మా! శ్రీవత్సాంకా
హృదాశ్రిమవాసిని !॥ హారతిఁగొనఁగదే ఓ, నీరేజనాభు
నినారీ! కరుణమెయి హా॥

4. ప్రికటత్రిమూ - ర్త్యాత్మకరూపిణి! తా - వకమాయావృ
తమూఢా - త్మకురాలిడెడుజయ॥ హారతిఁగొనఁగదే వి
దూరాఘువారా! కృపారసవారిధి! హా॥

5. నిరతముమంగళ - కరకరుణావృష్టిఁ - గురియింపుచులక్ష్మి -
నరసాంబాకరగత॥ హారతిఁగొనఁగదే శ్రితవాంఛితసుర
భూరుహమారహి హా॥

## (16)

### శంకరాభరణము—ఆదితాళము.

(మంగళమేరామచంద్రులకు, వలె)

మంగళమేసర్వమంగళకు...సంగతకరుణాపాంగశుభాంగికి మ॥

1. పొంగారుభక్తిఁ ది - న్నుంగొలుచునట్టి - యంగనామణుల
ముంగిటిపెన్నిధికి మ॥

2. మున్నుసీమంతిని - మున్నగునన్నులఁ - గ్రన్ననఁబ్రోచిన -
కన్నతల్లికిజయ మ॥

3. నిరుపమకరుణాశరధినెల్లప్పుడుఁ - బరపుచుండునట్టి - నర
సాంబాపాలకు మ॥

(17)

తోడిరాగము—ఏకతాళము.

(బాలరావే పోలనీభూ పాలమాళిని జూడుమా, వలె)

హారతిజయహారతి శుభహారతిగొను పార్వతీ! హా॥

1. కూర్మిరురాలనిత్రోచిపుచ్చితో - భారమోనముఁగావఁగా -
హారహీరపటీరకర్పూర - తారకీర్తివిశాలినీ! హా॥

2. అమ్మ! నీదుపదమ్ములనునా - నెమ్మనమ్ముననిల్పితిన్ -
ఇమ్మెయినినాపైనిగారు - ణ్యముచూపమిన్యాయమే హా॥

3. నీవుమెచ్చియనుగ్రహించెడి - త్రోవనిచ్చలుఁబోవనేఁ -
గోవిదనే యాయల్పురాలిని- గావగానలెఁగాకయా హా॥

4. నిన్నుఁగొల్చెడివారినేరము - లెన్నదానవుగావుగా -
విన్నపంబాలించియిఁకనా - పన్నరక్షకి! వేగమే హా॥

5. పరమపావని! నీదుపదవర - శేరరుహంబులెకాకితక్ - పర
మెఱుంగనిదీనురాలగు - నరసమాంబికచేతియా హా॥

(18)

శ్రీరాగము—ఖండజాతిచాపుతాళము.

(మంగళంతవస్తుసంతతమ్ - మదనగోపాల, వలె)

మంగళంబొసంగవేస్సతమ్ - అంగజారినారీ! మ॥

1. ముక్తపామరవ్రాతా! యుక్తజననేతా! ముక్తిఫలకుజా
తా! భక్తపారిజాత! మ॥

2. దురితభంజనధుర్యా! భరితపావనచర్యా! పురరిపుప్రియ
భార్య! గిరివరసుతయార్యా! మ॥

3. వరశిశ్రితావనలోలా! పరమకరుణావాల! నిరుపమగుణజాల!
నరసమాంబికాపాలా! మ॥

(19)

హిందూస్థానీ కాపీరాగము—ఆదితాళము.

(వారిజానన! హరే! నమోస్తుతే, వలె)

హారతియిదేకొనంగదే! సతీ! మార్గనైరినారి! యో
కృపామతీ! హా॥

1. ఘోరదురితవారిధరసమీరణా! రమా! ధరాధరోద్భ
వా! శివా! పరాకీపాటి - పాసిదయగొని హా॥

2. తావకపద - సేవకజన - తావినోదినీ! సుపావనా! శ్రితా
వనా! ఘనాపాంగాతి - కరుణఁగనుఁగొని హా॥

3. కోవిదజనసేవితఘన - భావుకచరణా! యిదేమదిన్, ము
దంబునన్ - సదానిన్గొల్తున్ - సర్వమంగళా! హా॥

4. లోకజనని! ప్రాకటకరు - ణాకటాక్షిణీ! ఘృణాగుణా!
నమోనమో బిరాననన్నాపైఁ - బ్రియముగైకొని హా॥

5. అంబ! నరసమాంబికాహ్వ - దంబుజాలయా! దయామ
యా! శ్రితప్రియ! నమోకళ్యాణీ! నతులొనర్చెదన్ హా॥

(20)

ధీరశంకరాభరణరాగము—రూపకతాళము.

(కరుణాహా శ్రితపాలా ద్భుతసీతారమణ, వలె)

జయహారతి దయతోడుతఁ - గైకోవే! జననీ! నయచారిణి!
భయహారిణి! ప్రియమారఁగనిదిగో జయ॥

1. అతిమోదభరిత! సజ్జన - నుతపాదకమలా! జయ॥
2. మనమారఁగనని శంబును - నినునామదిఁగొలుతుగ జయ॥
3. శ్రితలోకనిహితభావుక - వితతానుకంప జయ॥
4. అనుమానమిఁకనుమాని భు - వనపావని! వేగ జయ॥
5. వరతాపక కరుణాన్విత నరసాంబాపాలా! జయ॥

(21)

శంకరాభరణరాగము—ఆదితాళము.

(రమానుతోహారుని మంగళా స్తవనమే మోక్షసుఖదమైనది, వలె)

ఉమాసతీ! జాయమంగళంబిదె - ప్రమోదమున నందుమా!
రమా! తమోమయునునే - నిమేషమునునిను - నమోయ
ననెఉఁగఁ - దమోపహారిణీ! యు॥

1. దురంతపాతకభరంబుచే ని-న్నెఱుంగఁగరుణాం- తరంగిణీ!
నిరంతరమునీ - నిరంజనపదాబ్జ - మరందమొసంగితరింపఁ
జేయఁగ ను॥

2. స్మరించుభక్తుల - కురంగటసదా - చెఱంగుబంగరుతెరం
గునం - జరించుతల్లిరో! పరాకుసేయక బిరానననుఁగనిక
రించిదయతో ను॥

3. సమాహితమతిని - సమస్తజగముల - సమానముగఁగనుర
మాసఖీ! కుమారిఁగనప్రాయమేయమగు ప్రే - మమూవ
హిల నరసమాంబాపాలిని యు॥

(22)

అసావేరిరాగము—ఆటతాళము.

మంగళహారతి - రంగనితరుణిసీ! మంగళకర భవద - పాంగ
దృష్టులఁజూడు మ॥
1. నిరతాశ్రితదుఃఖ - పరిహారిణీ - వర బిరుదమూనినతల్లీ!
కరుణారసాంబుధీ! మ॥
2. అపచారిణి దీనిఁ - గృపసేయరాదన - కిపుడునిన్నోతుక -
కృపఁబూనినాపట్ల మ॥
3. పరమపావని! నీ - చరణసేవయకాకి - తరమునెఱుఁగనట్టి
నరసాంబయొసఁగెడి మ॥

(23)

ఆనందభైరవిరాగము—ఆటతాళము.

(రారారా రారఘురామా! నలుగుకు వలె)

హారతిదే - యంబా! త్రిజగదంబా! మేరామేరా - మిగుల
నిర్దయఁబూన హా॥
1. కన్నతనయనీ - తెన్నునవీఁడఁ - జన్నె? నీకా - పన్నా
వనీ! వే హా॥
2. నేరనేరమా! నిన్నేఁజేర - వేడికొొన, నేరమెంచక క -
న్నారఁగన్గొనుమా! హా॥
3. లోకానీకంబుల - నేకప్రేమమున - జోకఁగనుంగొని -
సాకెడుతల్లీ! హా॥

4. నిన్నే గాకితరుల - మన్ననతోడ - నెన్నఁడయిన వేఁడు
   కొన్నా నేజననీ ! హా॥

5. పరమపావని ! నీ - మరుఁగుఁ జేరితిని - సరగునఁగృపజూడు
   నరసాంబాపాలా ! హా॥

(24)

శంకరాభరణరాగము—ఆదితాళము.

(మంగళకర శ్రీ సత్యనారాయణ మంజులదివ్యగుణాభరణా, వలె)

హారతిగొనుము ధరాధరతనయా! యపహరణాశ్రితపాపభయా
   హేసదయా ! గుణనిచయా ! కృప, భాసిల మాపయిఁబరపి
   జయ హా॥

1. భక్తాపాయనివారణధామ ! సు, పాలితలోకసదభిరామా!
   శ్రితధామా ! శుభనామా ! దయ, జితసుమసాయక ప్రి
   యభామా ! హా॥

2. సజ్జననికర మనోరథదాయిని ! సాధువనప్రియచూతవనీ !
   మొనలేని, నెనరూని, మన, వినిజేకొనుము జగజ్జననీ హా॥

3. విశ్వజగన్నిర్మాణ సుకారణ ! విబుధమకుట శోభితచరణా
   యఘహరణా ! భృతకరుణా ! నర్, సాంబా హృదయాబ్జ
   విహారణా ! హా॥

(25)

హిందూస్థానీభైరవిరాగము—ఆటతాళము.

(రాధాకృష్ణా ! రక్షింపర ! కోపమేల? గోపబాలా, వలె)

హారతి దే, చేరిదయ, మీరనందు, గౌరీ ! వేగ హా॥

1. మన్ననతో, నిన్ను వేఁడు, చున్న దానఁగన్న తల్లీ! హా॥
2. ఓపికనా, పాపముల, జోపికృపఁ, జూపుమమ్మ! హా॥
3. అంబా! నర, సాంబికామ, నోంబుజాతా, లంబపాద! హా॥

(26)

జంఝూటిరాగము—ఆదితాళము.

(బూలాయా కెంయెహీ, వలె)

హేదేవీ! శర్వాణీ! హారతిదే, కొమ్మా! మాయమ్మా! హే॥
1. సాధుజనావన, చణ, భవహారిణి! సర్వావనీ! భవానీ! హే॥
2. పాదానతామర! వేదాంతభాసుర! రాదాదయసదయా! హే॥
3. జ్ఞానస్వరూపిణీ! శ్రీ! నరసాంబికాధ్యానాయుతపదాబ్జ! హే॥

(27)

హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(శిరపరిహైధర్త్రిపరహా, వలె).

గౌరి! భవానీ! కరుణాభరణా! గైకొనుమారతిదే, చేరితిన్నీ
చరణ యుగళినే, శివురాణి! దయాబ్ధీ! గౌ॥
1. సాధుజనమనస్సదనా! యిటైనా, నన్ను తినందఁగఁదే, యే
దెకారుణ్యము చూపవెయద, నిదియేకదె జననీ! గౌ॥
2. బాలనుగావఁగభరమా? తరమా పావని! నినుఁగొల్వ, ?
జాలమేలే శరణంటిఁగదా, సదయా! ముదమూర గౌ॥
3. సారముదావహచరితా! భరితా, జాండకటాహచయా?
నారసాంబానతపద! కారు, ణ్యనిధానమ! కొనుమా, గౌ॥

(28)

హిందూస్థానీ కాఫీ రాగము—ఆదితాళము.

(నిదురలు జెందవద్దు, వలె)

మంగళంబిదే యోయంగజారినారీ ! మం॥

పొంగుచును నీకొసంగెదనుదల్లీ ! మం॥

1. దోసమెంచినాపై, రోసమూనకమ్మా! యాసఁదీర్పుమని, డాసితినినిన్ను మం॥

2. నీవుమెచ్చురీతి, సేవఁజేసివేఁడఁ, గోవిదననెనన్నుఁ, గావవలయుఁగాక మం॥

3. వరశిరితాళిఁబ్రోవ, బిరుదమూనినతల్లీ ! కరుణఁజూడవేల, నరసమాంబాపాలా ! మం॥

(29)

బేహాగ్ రాగము—చతురశ్రజాతి చాపుతాళము.

(రఘునందన ! కటాక్షింపరా, వలె)

జయ, హారతిదెగ్గెకోఁగదే జయ॥

ఆలస్యమేల భయహారిణీ ! జయ॥

1. మీరుభక్తినీదుపద - వారిజంబులనుసిదా, చేరికొల్తునేరములఁ, బారఁద్రోలిదయ జయ॥

2. కొల్లలుగభక్తులకు, నెల్లకోర్కులిచ్చుకల్ప, వల్లివంచునీదు కన్నపిల్లభక్తినిదు జయ॥

3. శంబరారివైరినారీ! యంబికా! మదంబ! నర, సాంబికాసేవితా చరణాంబుజ! కృపాంబునిధి! హా॥

(30)

బేహాగ్ రాగము—ఏకతాళము.

(దేఖోసఖా కైళిమజా, వలె)

గౌరి! జయ! హారతిదేకరుణఁగొనఁగదే, భవానీ! కరుణఁగొన
గదే లేరునీసములని నేనినుఁజేరికొల్చెదన్॥ భవానీ! చేరి
కొల్చెదన్ గౌ॥

1. సారెకువే, సారకనీ, శరణుచొచ్చెదన్ గుమారిన్॥ శరణు
చొచ్చెదన్ గారవంబుదనరవేగమె కావరాదొకో కుమా
రిన్ గావరాదొకో గౌ॥

2. దాసమనో, వాసినినీ, దయనుజూపవే, సదానీదయనుజూ
పవే వాసిమీఱ, సురకి, రీటవిభాసురాంఘ్రికిన్, సదానీభా
సురాంఘ్రికిన్ గౌ॥

3. మారహరో, చారుసతీ! మదినినిల్పితా, నిదేనిన్మదినినిల్పి
తాఁ గూరిమినినరసమాంబిక, కోరియొసఁగెఁగా, యిదేని
న్గోరియొసఁగెఁగా గౌ॥

(31)

నవరోజు రాగము—ఆదితాళము.

(ఋతుమె ఋతుపసన్ వసంతహోగయా, వలె)

అతులశుభకృతీ! దయాకృతీ! సతీ!
నతులొనర్తు నందుకృపా మతినిహారతి అ॥

1. మనవివినఁగదే, యుమా! రమాసఖీ!
జనని! నీపదంబుసదా, శరణమంటినే అ॥

2. సకలజగములన్, బ్రోచెద మేర్పడఁ
బ్రకటరక్ష సేయుటనీ, పనిగ దేయిదే అ॥
3. దురితహరనయా! విధూతశ్రితభయా!
నరసమాంబికాశ్రితహృన్నలినవాసినీ! అ॥

(32)

ముఖారి రాగము—చాపుతాళము.

(సుమరతఫలదాయి, ఆయిసరస్వతీమాయీ, వలె)

జగదవననిధానా! నేనీసమానలంగాన సారవి, చారవి హారిణి
హారతిచేరంజితలోకా జగద॥
1. సుజననికరలోలా! లీలా, శుభాకృతివిశాలా శోభిత, ప్రా
భవ! లోభవి, హీన! సదాభంజితపాపా జగద॥
2. భరితసకలలోకా, నీకా! పదావనతనాకా! పావని కావని
దేవినుతింతుసుధీ, వర్ణితచర్యా! జగద॥
3. త్రిపురదనుజవైరి, నారీ! త్రిశుద్ధిగను జేరి దీవనలేయవె,
దేవి! నరసమాంబా వందితపాదా జగద॥

(33)

బేహాగ్ రాగము—ఆటతాళము.

(రాజరంజేళ మధురాను, వలె)

మంగళంబిదే మహితాత్మ! కైకోఁగదే
మహితాత్మ! కైకోఁగదే మం॥
1. ధీరాత్మ ధామా! దివ్యాత్మ నామా! కారుణ్యసీమా!
యుమా! మం॥

2 భవ్యస్వభావా! పాలింపరావా? దివ్యప్రభావా!శివా! మం॥
3. ధరరాజజాతా ! దాక్షిణ్యపూతా ! నరసాంబానేతా !
నుతా మం॥

(34)

హిందూస్థాని కాఫీరాగము—ఆదితాళము.

(త్రిగలోచన మధుమాతియారే, వలె)

ప్రియమాతా ! జయ హారతిదె ప్రియ॥
జయ............జయ............ప్రియమాతా॥
సారెసారె నిన్నె గోరెదను బ్రోవ, దడవేలా? నరసాంబాపాలా!
తడ ... నర ... ప్రియమాతా॥

(35)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(రారాసుకుమారా బువ్వమారగింప, వలె)

గౌరీ! శివునారీ! సుకుమారీ! గొనుహారతి గౌ॥
కూరిమిని గోరి నిను జేరితమిమిాటి భూరి రహిదేరియిటుఁ
గూరిచితినీకిదె గౌ॥
1. దేవి! నీచరణరా, జీవము లెపుడునే, భావమందునిల్పెదన్
నే భా...గతి, నీవేగదె, రావే, కృప, నీవేయిక వే
గతి, నీవె... ... ...
గతి, నీవేగదె, రావే, కృప, నీవేయిఁకవేగమె గౌ॥

2. ఎల్లెడశ్రితకల్ప, నల్లివంచునమ్మితిన్, నీ చల్లనికటాక్షము నీ చల్లని...నిటు, జల్లఁగదె, తల్లీ! కృప, వెల్లివిరియ

నిటు, జల్ల... ... ...

నిటు, జల్లఁగదె తల్లీ! కృపవెల్లివిరియఁగను గా॥

3. సారవిచారిణీ! సు, ధీసంచారిణీ! యో, నారసాంబికావని యో, నా...సువి, చారా! యిదిమేరా! దయమీఱఁగొనుమా

సువి, చారా... ... ...

సువిచారా! యిదిమేర దయమీఱఁగొనుమా యిదె॥

(36)

హిందూస్థానీకాఫీరాగము—రూపకతాళము.

(పసుపునలిచెనే శ్రీగౌరి, వలె)

మంగళాలయా! మాతల్లీ! మంగళంబుగైకొనుమా, మం, మం॥

1. ఓదయారసాంబునిధీ! నీ, పాదపంకజంబులకుఁ

బాదపంక... బాద... మం॥

2. సాధువాసినీ! దేవీ! నే, మోదమలరనిచ్చెనే

మోదమలర... మోద... మం॥

3. నారసాంబికా వినుతపదా! లేరు నీసమానలిదే

లేరునీ... లేరు... మం॥

(37)

ధీరశంకరాభరణరాగము—చాపుతాళము.

(పువ్వులుచల్లరే భువనవంద్యునిపై, వలె)

హారతిఁగొనవే, హారునితరుణి! వే హా॥

కోఁరితినేని, స్గుణనిధి! రావే హా॥

1. సజ్జనావన! నీ, శరణము, జననీ! సజ్జ ...
మజ్జగములనిన్ బోలఁగఁగన, నీ, హా॥

2. కామితదాయినీ! కాత్యాయని! నీ, కామిత ..
కోమలపదముల, కను నెనఁగెదనీ హా॥

3. అమ్మ! నీపదప, ద్మముల సతమున్ అమ్మ ...
నమ్మితిమదిలో, నరసాంబానుతా! హా॥

(38)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(గౌరీ! పన్నీరుచల్లఁగదె, వలె)

హారతిదేవి! గొనఁగదే, జయ హా॥

సారా, చారా, ధారా! జయ హా॥

1. శ్రీశివా! భక్తజన, సేవలందఁగరావా శ్రీ ...
మము బ్రోవగతి నీవ మము ... మహానుభావ! హా॥

2. ఆశ్రితజవరస, నామృత శుభనామా! ఆ ...
అహిదామా! శివృభామా! అహి...కారుణ్యధామా హా॥

3. అఖిలశుభద! నర్, సాంబికానుతపాదా! అఖి ...
ఇదివాదా, కృపరాదా! ఇది ... కుమారిమీద హా॥

(39)

హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(సావిత్రికథ సఖియారో వినఁగదవే, వలె)

రంగనిరాణీ! మంగళారతిఁగొనుమా! రంగ॥

1. తల్లి! విబుధకల్పవల్లి! నీపాదము
   లుల్లమునందు నిల్పనే                రంగని॥
2 మన్ననఁజేసి యాపన్నులఁబ్రోవనీ
   కన్న వేల్పులుగలరే!                రంగని॥
3. నారసాంబికానుత! సారగుణాన్విత!
   కోరికలిడిప్రోవవా!                రంగని॥

(40)

కీరవాణిరాగము—ఆదితాళము.

(తనయా! నీకీ, యడవిని, వలె)

గౌరీ! నినునేఁ, జేరిముదంబునఁ
   గోరితి మంగళహారతిగొనుమా!                గౌ॥
1. కాందిశీకులపాలి, కల్పకమనుచుని
   న్నందురు విబుధులా, చందముఁజూపు                గౌ॥
2. ఏరికనీసరి, వారలుదీనులఁ
   జేరియభయమీడు, కారుణ్యనిధుల్                గౌ॥
3. దురితాలయయని, కనికరమెడలకు
   శరణంటినినుత, నరసాంబానుతా!                గౌ॥

(41)

హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(గీతికామంగళహారతి, వలదువలదు విడువకుబాణము, వలె)

గౌరి! హరునిసుకుమారి! కరుణనీ, హారతినందఁగదే
   దూరీకృతశ్రిత, దోషసమితివని చేరియొసఁగితినిదే
   యీ, హారతినందఁగదే                గౌ॥

1. సురగరుడోరగ వరవందిత ! త్వ, చ్చరణశరజములకుఁ
కరములరెడికుతు, కంబుననర్పణ, గావించెదఁగొనుమా
నుత దీవించితిననుమా గా॥

2. సలలితగతినా, సావిత్ర్యాదులఁ, జయ్యననేలిన నీ
కలికికఁటాక్షపు, టలరుకలుములిటు, లొలుకఁగఁజూడుమిదే
కృపఁదొలఁగుట తగదుగదే గా॥

3. శారదశరమం, దారయశోయుత,! నారసాంబికావినుతా
భారమెనీదుకు, మారినిబ్రోవవె, చేయభయమిడవే
కృపమీరెదనికననవే గా॥

## (42)

### కమాచిరాగము——రూపకతాళము.

(చెలి వసంతకాలమెంతో, వలె)

మంగళంబనంగనైరి ! యంగనా ! గొ, నంగదె, జయ, మం॥
మంగళాలయా! యోసర్వ, మంగళా! దయానిధే! జయ, మం॥

1. అలఘుజనులహృదయతాపః ములవెలార్ప నెయ్యెడన్
గలికిచూపులెలమిఁజిలుకు, వలిమలనుత! నీకిదే! జయ, మం॥

2. కలిమిచెలువఁ బలుకువెలఁదిఁ, గలిసి లీలగ్రాల గా
నలరు భక్తహృదయసౌధ, ములఁజరించుతల్లి! యీ, జయ,

3. కూరిమినిజేరియిడుదు, గారవంబుమీఱఁగా
నారసాంబికార్చితాంఘ్రి, నీరజంబులకిదె జయ, మం॥

## (43)

### నాటకురంజిరాగము—ఆటతాళము.

(మంగళం పద్మాలయాధిపతయే, వలె)

మంగళంకళ్యాణి! రంగనిరాణీ!
నీస, మానలేరిక భక్తదత్త, మహితాభయపాణీ! మం॥
1. సల్లలిత కారుణ్య శ్రితసురవల్లీ!
నీపసి, పిల్లఁబ్రోవుము నీదుప్రేమము, పెంపారఁదల్లీ! మం॥
2. సాధులోక వశీకరణ శుభపాదా!
దేవీ! యేదికారుణ్యంబు నాపయి, నింతైనరాదా? మం॥
3. ఓమహాత్మక! నారసాంబాపాలా!
ప్రోవ, నీమనవి కూరిమిని జేకొన, వేజాలమేలా? మం॥

## (44)

### హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(పాలకడలి శయనరారా, వలె)

హారతిని గైకొనవెగారీ! సత్కరుణమీాటి హా॥
1. సారెసారె నీదుపాద
వారిజంబులనుభక్తిఁ
గోరికొల్చు నుతనుగావవా? మహానుభావా! హా॥
2. కన్నడసేయక దయనా
పన్నులనుబ్రోవబిరుదు
గొన్నమాట మరువబోకుమా! కారుణ్యసీమా! హా॥

3. ధీరజన హృన్నీరభవసం
చారిణి లోకాధారిణీ!
నారసాంబికా శ్రితావనీ వేగంబె జననీ! హా॥

## (45)

### బేహాగ్ రాగము—ఆదితాళము.

(ఎంత భ్రాంతి గలిగె నీదమయంతి కాంతకు, వలె)

మంగళంబుఁగొనగదే యిదె మంగళాలయా! మం॥

1. పొంగుచు నీపాదములకొ, సంగెదనుగదే
సంగతకారుణ్యా! సు, ప్రసాదమిడఁగదే మం॥

2. నిన్ను వినా జగములకును నేతలెవ్వరే
కన్నతల్లి! సుతలపైని గరుణవిడతురే మం॥

3 భూరికృపాభూషణా! ప్ర, పూతతోషణా!
నారసాంబికా శ్రితావనా! సుపావనా! మం॥

## (46)

### హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(శ్రీ వినాయకా ప్రభో!, వలె)

మంగళారతి సతీ! కృపామతీ! మం॥

1. సాధుజన ప్రమోదదాయిని! మోదయానిధీ
నిన్నె నమ్మితిఁ, గన్నతల్లి! గైకొనంగదే యిదే మం॥

2. కామితంబు లొసఁగికరుణఁ, గావవే సతీ!
లోకాతీతా! శోకహారిణీ! గొనంగదేయిదే మం॥

3. నారసాంబికా శ్రితావనా! సుపావనా!
సారాచారా! చేరికరుణతోఁ గొనంగదేయిదే మం॥

(47)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(తాండవనృత్యకరీ, వలె)

మంగళహారతిదే యుమాసతి! మం॥

1. సురగణపూజిత, సురుచిరపాదా!
కరుణనుగైకొనుమా! యుమాసతి! మం॥

2. పాలితలోకా! ప్రణమితనాకా!
లీలనుగైకొనుమా! యుమాసతి! మం॥

3. నారసాంబికానుత! సారగుణాన్విత!
కోరికలిడిగొనుమా! యుమాసతి! మం॥

(48)

హిందూస్థానీకాఫీరాగము—ఆటతాళము.

(వనజాసనురాణీ!, వలె)

జయహారతి భక్తాభయదాయిని వేగఁ
బ్రియమారఁ గైకొనవే దయామయా! జయ॥

1. వరీసీసరి, వారా శ్రితులఁబ్రోవఁ
గూరిమి నుతఁగావవా! దయామయా! జయ॥

2. దీనావన! సు, జ్ఞానాధీనా!
దేవి! కరుణఁజూడుమా! దయామయా జయ॥

3. అంబా! శ్రితపర, సాంబానతపాదా!
    సాంబశివపురితరుణీ! దయామయూ జయ॥

(49)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(బాలగబోలి, వలె)

హారతి దయావారిధి! యిదే చేకొనఁగదే
    చేకొనఁగదే కళ్యాణీ! చేరి
    చేకొనఁగదే కళ్యాణీ! చేరి ... హా॥

1. సదయా! నీకీజాలమేలా?
    సంతసమున నీసుపదము
    లెంతుఁగాదె నాదుమదిని సంతతంబును హా॥

2. జగదాధారా! సాధులోలా!
    శాంకరి! కరుణాలవాల!
    యింకనైనఁగరుణతోడ నేలుకోఁగదే హా॥

3. అఘవిదూరా! యనఘ! వర
    సాంబికా వినుత్యాంఘ్రియుగా
    సాంబురాణి! యోమహాత్మక యంబ! గావవే హా॥

(50)

సురటరాగము—ఆదితాళము.

(పన్నీరుపైఁజల్లెనే, వలె)

కళ్యాణి! గైకొనవె, సత్కరుణ కళ్యా॥

కరుణా భరణా ! సరగునహారతి గళ్యా॥

1. అలఘుజనుల హృద, యాంబురుహములన్
విలసిత మధుకర, ములనఁగ సతతము
నలరారెడునీ, యంఘ్రియుగమునకుఁ గళ్యా॥

2. సలలితకరుణను, జగదానీకము
తెలమిని వెలయఁగ, నేలెడిబిరుదము
గలిగిననీపద, కంజయుగమునకుఁ గళ్యా॥

3. సురనికరశిరో వరభూషణమై
నరసాంబా వనపరమై జగముల
వరలెడునీ సచ్చరణయుగమునకుఁ గళ్యా॥

(51)

హిందూస్థానీకాఫీరాగము—ఆదితాళము.

(పావనమూర్తిగొను, వలె)

రంగనిరాణీ ! గొను మంగళహారతి రంగ॥
పొంగుచునీకునె, సంగెదవేగమె రంగ॥

1. ఇందుధరునిసతి యిందునిలిచిరతిఁ
పొందుగ నాదునతి సంది యీహారతి రంగ॥

2. కన్నతల్లీ ! నిను నెన్నఁగఁ జాలుదునె
మన్ననచేసికృపఁ గ్రన్ననఁగైకోఁగదె రంగ॥

3. భారమెనీదుకు మారని బ్రోవఁగను
నారసాంబికావన ! చేరికరుణఁగొను రంగ॥

## (52)

హిందూస్థానీభైరవిరాగము—ఆదితాళము.

(బుద్ధము వాగిందపరారా, వలె)

హారతి ధీరచిత్రధామా! జయహారతి ధీరచిత్రధామా!
కారుణ్యసీమా! గైకోవే వేగమే హా॥

1. మీరినవేడుకన్, గోరితివేసతీ! మీ ...
చేరి కరుణనందుమమ్మా! చే, దరిచేరి ... హా॥

2. పావని! నీమృదు పాదంబులెయ్యెడన్, భా ...
భావించి సేవింతుఁగాదె, భా, మదిభా ... హా॥

3. అంబా! యిదేజగ, దంబా! సదా నర, అం ...
సాంబా వినతులందికొమ్మా! అంబా నరసాం ... హా॥

## (53)

హిందూస్థానీకాఫీరాగము—రూపకతాళము.

జయమంగళం బొసంగెదనో, చంద్రశేఖరీ!
ప్రియమార నీదుపాదములకు వేడ్క మీరఁగా జ॥

1. కృపఁ గుమారిమీదనురా, గిల్లఁజిల్కుచున్
గపురంపుహారతిని బ్రీతిఁగైకొనంగదే జ॥

2. మోదావహ ప్రభావనేన మోయటంటినే
యీదీపహారతిని స్వీకరింపఁగదెసతీ జ॥

3. కరుణానిధీ! గొనంగదెన క్షుత్రహారతి
నరసాంబికా శ్రితాంతరంగనలినవాసినీ! జ॥

(54)

తోడిరాగము—రూపకతాళము.

(వామదేవనన్ను గావ, వలె)

మంగళాలయా! దయాళో! మంగళంబిదె
 భంగరహిత సేవకాంత రంగవాసినీ కళ్యాణీ!
 రంగారునపాంగ శ్రీలంగనిగొనుమా మం॥

1. నిక్కమీవుగాక వేరు దిక్కెవ్వరే
 అక్కటికము జూపినన్ను నెక్కరణిని బ్రోచెదవో
 యక్కా! నీకుదక్కరహి మ్రొక్కెదనిదిగో మం॥

2 ఎన్నడునీపాదసేవ యేమరనుగదే.
 పన్నగేంద్ర భూషణిప్ర పన్నతోషణీ కళ్యాణీ!
 నన్నుతింతునిన్నే మది నెన్నిపావనీ మం॥

3. ఇంబడరగగొల్తునీపా దాంబుజంబులన్
 సాంబశివునిరాణి నారద, సాంబికా వినుతాంఘ్రియుగా
 అంబా! జగదంబా! కరుణాంబురాశివే మం॥

(55)

బేహాగ్ రాగము—ఆటతాళము.

మంగళాలయా! యో, సర్వమంగళా నీకుమంగళ హారతిదే
మంగళహారతి మంగళహారతి మంగళహారతిదేగయికొను మం॥

1. నీ, పదపద్మములనే మదినిల్పిగొల్చెద, ముదముతోడ
 నంబుమా! వేగమ మం॥

2. ఓ పరమ కారుణ్యాభరణా! సుచరణా! సురనుత
   గైకొనుమా! వేగమ మం॥
3. భా, సురపుణ్యాశీలా! నరసాంబాపాలా! సా, దరముగఁ
   గొనుమా యుమా వేగమ మం॥

(56)

కళ్యాణిరాగము—రూపకతాళము.

(శ్రీకనకగిరి, వలె)

కళ్యాణీ! ధరాతనయ! కరుణనుహారతిఁగొనుము
   కామితదాయిని! కావుము దయఁబ్రోవుము, కళ్యా॥
1. దయఁజూడుము సాధుహృదయ భయహారిణి! లోక
   మాత? ప్రియమార నీపదమువేఁడెదఁ గొనియాడెదఁ, గ॥
2. ఆగమవినుతాంఘ్రియుగ! అనయమునీ సేవమరువ
   జాగేలేనాదరికి, రాఁగదె కృపనీగదె, కళ్యా॥
3. నరసాంబావనాదరణ! అరమరయేమిటికిబ్రోవ
   నెరనమ్మితినా జననినీవనిమదిఁబావని, కళ్యా॥

(57)

ఖరహరప్రియరాగము—ఆదితాళము.

(నేలుగునవురారా నిన్నులుమరువేడెద, వలె)

కైకొనవె దేవీ! స, త్కరుణనుహారతిఁ, గై ...
   ప్రియముననీదుపాద, బిసరుహములకొసంగెదను గై॥
1. సకలసంపదలనొసఁగి, సౌభాగ్యములనొసంగి స ...
   ప్రకటరీతినిభక్త, నికరములనేలుతల్లీ! గై॥

2. సతతంబునీదు సేవా, మృతమునసలరారు
 సతులభాగ్యంబొసఁగి యాదరంబున వేగ, గౌ॥
3. సారకారుణ్యనిలయా! సరగునసీకుమారి
 జేరికోరికలొసఁగి, నారసాంబికావనా! గౌ॥

(58)

గరుడధ్వనిరాగము—ఆదితాళము.

(ఆనందసాగరమే, వలె)

కాత్యాయినీకరుణా, భరణా!
 సుగుణాకారిణి నీకిదె శ్రీ, కా॥
 నిత్యంబునీనిగమాంతసం
 స్తుత్యాంఘ్రులకుఁ శుభహారతిదిగో, కా॥
1. ధీరాత్మధామా! త్రిపురారిభామా?
 సారెకునను గృపమీరంగగనుమా
 యేరినీకునీడీజగతిన్
 నారసాంబా! నతపాదయుగ కా॥

(59)

జంఝూటిరాగము—రూపకతాళము.

(దోషహరణా! గైకొను మణిభూషణములను, వలె)

గౌరి! కరుణమీరఁగ జయహారతి గొనుమా
 హా, జయహా ... గౌ॥
1. సారకరుణా ధారిణి! యీ జాలమేలనే, జా, యీజా, గౌ॥

2. దురితహరణ! భక్తహృదయ, తోషణచరణా! తో,
   సంతోష, గా॥
3. నరసాంబికా శ్రితనత చరణయుగళికి, చ, నీసచ్చర, గా॥

## (60)

### కీరవాణిరాగము—మిశ్రజాతిలఘువుతాళము.

(శ్రీ జగన్నాథపురీవరగుణధామా, వలె)

మంగళహారతి రంగనితరుణినీ,
   బంగారుపదముల కొసంగెదనమ్మా! మం॥
1. గంగాధరునిముద్దు, శృంగారవతిసతి!
   సంగతకరుణాంత, రంగా! గొనవమ్మా! మం॥
2. నిరతమునీపాద, నీరేజములఁగొల్తు
   నతమరసేయక, అందఁగదవమ్మా!
3. కరుణాంబురాశి! నీ, దరిఁజేరికోరితి
   నరసాంబాపాలా! స, త్కరుణఁగొనవమ్మా! మం॥

## (61)

### మాళవగౌళరాగము—రూపకతాళము.

(వినవేయోమనసా, వలె)

గిరిజా హారతిదే, గి॥
   నిరుపమకరుణా భూషణి గి॥
సరసకృపాలోకనముల
   నరయుచుఁగైకొనవెజనని గి॥

1. భారమనక దాసజనులఁ, బాలించుతల్లివనుచు
సారెకునిన్నెంతోవిబుధ, వారంబులుపొగడవిందు  గి॥
2. ప్రాకటకరుణాకటాక్షో, లోకంబులసాకఁజేసి
లోకజాలములకుశుభా, నీకంబులఁగూర్చుతల్లి!  గి॥
3. ధీరమతుల పాలిటిమం, దారంబవీవుకావె
నారసాంబికాంతరంగ, నీరేజవాసనిపుణ  గి॥

## (62)

జంఝూటిరాగము—త్రిశ్రజాతిలఘువుతాళము.

(విరజాజిపూల, వలె)

కరుణాకరా! యీమంగళారతి గైకొనఁగదవే
సురసేవిత ప్రభావపాద! శోభానిధీ!  కరు॥
1. సరిలేరునీకటంచు హృదయ, సారసమున నే
నెరనమ్మియుంటినోజనని! నీపాదముల్  కరు॥
2. తరమే భవత్ప్రభావగుణవి, తానముపొగడ౯
సరసాంబునిధి! సుధాంశుమౌళి శాతోదరీ!  కరు॥
3. వరమిచ్చిబ్రోవరావె లోక, పావని! వేగ
నరసాంబికావనీ! భవాని! నారాయణీ!  కరు॥

## (63)

మాయామాళవగౌళరాగము—ఆదితాళము.

(మత్తాళినీలవేణిరో, వలె)

రంగనిరాణీ! పావనీ!
పొంగుచునీకునొసంగెద హారతి  రం॥

1. నిరతమాశ్రితతతి, వరములనొసఁగుచుఁ
   గరుణామృతంబును, గురియుచునందుము,   గ౦॥
2. వారకవిబుధకై, వారములందుచు
   మీరుకరుణలోక, వారముఁ లేలుతల్లి!   ర౦॥
3. సూరివినుతపద, సారసయుగయిదె
   కూరిమినందుము, నారసాంబికావనా!   ర౦॥

## (64)

### బేహాగ్ రాగము—ఆదితాళము.

(చేడియతోడఁగ ప్రపువీడియంబు, వలె)

మంగళహారతియ్యరె, •యంగనలుప్పొంగుచు
   రంగనిరాణికిసర్వ, మంగళకుశుభాంగికి,   మం॥
1. ఇంపడర సజ్జనులకోర్కెలిచ్చి ప్రోచుతల్లికి
   చంపకగంధులుకనిక, రంపుపాలవెల్లికి,   మం॥
2. నిత్యైదువతనమ్మువిద్య, సత్యసంధతయు, నీపై
   నత్యలఘుభక్తియునుస, త్కృత్యాసక్తినిడుమని,   మం॥
3. వారనిభక్తితోడవ, పారకృపారాశికి
   నారసాంబికావనికి, సారసవాసినికి,   మం॥

## (65)

### మాళవగౌళరాగము—రూపకతాళము.

(తులసీదళములచే సంతోషముగాబూజింతు, వలె)

ధరణీధరతనయా! బుధప్రకర! సుజ్ఞేయ!   ధర॥

వర యోగిహృదయాలయ!
  కరుణామయ హారతిగొను, ధర॥
1. సురసేవితసత్పాద! శోభితప్రాభవ! శ్రీశివ!
  పరమేశ్వరీ! సతీ! ప్రపంచకారణి! నుతన్
  సరగునఁ గృపఁగనుఁగొనుమా సర్వాత్మక! శార్వాణి!
  నిరపాయిని! శ్రీదాయిని!
  నరసాంబికావనమతి! ధర॥

(66)

సింహేంద్రమధ్యరాగము—ఆటతాళము.

దయఁజూడఁగాఁ, దగదే, యగజాత!
  ప్రియమరార, గయికోవె యనుమాన
  మునుమానిఘనకరుణ నీజయహారతి దయ॥
1. నినుఁగాకీజగముల నెనరుంచి పాలించు
  నేతలింకేవారలే కరుణాభరణాస
  చ్చరణాబ్జ! నరసాంబా
  దరణాసువరములిడుమా! పరమేశ్వరీ! దయ॥

(67)

శంకరాభరణరాగము—త్రిశ్రజాతిలఘుపుతాళము.

(సాంబసదయమతీ సార్వపతీ సమ్యగాకృతీ, వలె)

దేవీ! త్రినయనునాతి! సుకృతీ! దివ్యహారతి దివ్యహారతి,
  సతీ! దివ్యహారతి, దివ్యహారతి, దివ్యహారతి, దేవీ॥
1. జగములేలఁజాలునీదు చరణయుగళికిఁ

జరణయుగళికిఁ, జర ... జర ... జర ... దేవీ॥

2. ధీరహృదయధామ! కరుణమీరఁగఁగొనుమా
మీరఁగఁగొనుమా, మీరఁగఁగొ...మీర...మీర...దేవీ॥

3. నారసాంబికా శ్రితావన! సారగుణఘనా!
సారగుణఘనా, సార ... సార ... సార ... దేవీ॥

(68)

బ్యాండుస్వరము—త్రిశ్రజాతిలఘువుతాళము.

పరమాదర! కరుణాకర! నిరతావనచణ! శుభగుణ!
సరిలేదుగా దెజనని! నీపదసారసారసములకున్
గుణనిధీ! కడురహిన్
గోరితినందఁగ వేఁగ దే హారతి దే, పర॥

1. సురసేవిత వరపావన చరణారుణ శిరసీరుహా!
నిరతానవద్య! నినునుతింప నేర నేరములవెసఁ
బరగుసత్కరుణామై
బారఁగఁద్రోలఁగదే సుకృతీ సారమతి, పర॥

2. అరమేటికె కరుణింపవే నరసాంబికాశరణాలయా!
వరమిచ్చిబ్రోవగదవె సుజనస్థల! బాలశశిధరా!
గురుకృపాశ్రరణనన్
గూరిమినారయ వేపావనీ! లోకావని! పర॥

(69)

హిందూస్థానీభైరవిరాగము—ఆదితాళము.

పరమేశ్వరీ! గౌరీ! హారతిసతీ!

కరుణించిస్వీకరింపుమా! దేవి! దయఁ,  బర॥

1. కలుషములనీను నీదు, కడగంటిచూపులఁ
 బలుమారుతిలకింపుమా! దేవి! దయఁ,  బర॥

2. వరభక్తజనావన, పరవంచునెమ్మదిని
 నెరనమ్మియుంటిఁబ్రోవవే దేవి! దయఁ,  బర॥

3. తరుణేందుశేఖరీ! కరుణాపయోనిధీ!
 నరసాంబికాశ్రితావనీ దేవి! దయఁ,  బర॥

## (70)

జంఝూటిరాగము—ఏకతాళము.

(బహార్, బహార్, బహార్, వలె)

దయామయా! నయాలయ! యీశ
 ప్రియా! జయమంగళమ్  దయా॥

1. నిన్నెసదామదీ, మన్ననినిల్పితిఁ,
 గ్రన్ననఁగైకొనుమా
 పన్నతిసేతుఁబన్న గేంద్రభూషణీ!  దయా॥

2. సాధుజనావనీ! వేదాంతరూపిణీ!
 మోదావహాకారణి!
 రాదేదయలో, కాధారిణీ! జననీ!  దయా॥

3. నారసాంబికాహ్వ, తాసారసవాసినీ!
 కోరికలనొసఁగుమా!
 సారెకుఁగృపమీరఁగనుంగొనుమా,  దయా॥

(71)

ముఖారిరాగము—ఆదితాళము.

హా, రతి యతులసుకృతీ
చేరినీకునతి శ్రీసతి! యిడుదుజయ హా॥

1. ధీయుతా! దివిజవినుతా
దేవిసత్ప్రథితభావితచరణ జయ హా॥

2. పావనీ! పరమజననీ!
ఫాలలోచనుని భామిని! గొనుము జయ హా॥

3. కోరెదఁగొనుము శుభద!
నారసాంబికావన! ఘనకరుణజయ హా॥

(72)

శహనారాగము—ఆదితాళము.

(సాంబశివాయనవే, వలె)

హారతివేఁ గొనవే కోరితి జయ హా॥

1. ధీయుతా! సుధీనుతా! సురార్చితా!
ధరానుతా! జయ హా॥

2. మేలేయిటుజాలంబు సుశీలా! నుతనేలంగృప
నపారముగనిడి హా॥

3. మరువక నా మదిగొలుతున్
నిరతమునీ చరణములన్
వరములొసఁగి దయనరయుము వేగమె
నరసాంబానుతా! వరమహిమమహిత! హా॥

(73)

ముఖారిరాగము—ఆదితాళము.

(పద్మమిత్రమాపాలిదైవమా, వలె)

హారతిదయా, కారిణీ! జయ హా॥

గారవంబుమీరఁ గైకోవెదేవీ! హా॥

సారెకునీపాద నీరేజములఁ

జేరిభక్తిమీర సేవించెద హా॥

1. వారకసర్వబ్బృం, దారకానీకముల్

కోరిభక్తిఁ గైవారముల్ సేయఁగా

సారసాలయావి, శారదలఁగూడి

మీరిభక్తులకు మేలొసంగుతల్లీ! హా॥

2. వేరులేకెయ్యెడ, వెలుంగుచునాది

కారణంబవై ఘనమహిమఁగా

లేరునీకు సరివారలంచు సుధీ

వారముల్ సన్నుతింపఁగా జెలంగుతల్లీ! హా॥

3 నీరజోద్భవాదుల్, నేరరన్ననీయ

పారసన్మహిమల్, వర్ణనల్ సేయన్

పరితగువారలీడితపాద!

నారసాంబికావనా! సుభక్తాధీనా! హా॥

(74)

శంకరాభరణరాగము—రూపకతాళము.

(సరసీరుహదళలోచన సంశ్రితభమోచన, వలె)

గిరిజా! గొనుమిదెహారతి కిల్బిషాపహా! శ్రీసతి! గి॥

సురలోక వినుతపాదా! బిరానఁ జనవిరాద గి॥

1. పరమేశ్వరి! శ్రీకరి! మురరిపు ప్రియసోదరి!
   వరదాయిని! శాంకరీ!
   వాలయుంబుకరుణన, న్నేలుముచాలదయాలయ! గి॥

2. పరగోచరసద్వేష! తరుణేందువరభూష!
   నరసాంబికాతితోష! నిరుపమ శ్రితవారపోష!
   అరయేటికె యెడఁదనుగని కరమూనవెజననీ! నీ
   వరమహిమముఁజూపవే, ను వరంబులిడిప్రోవవెవెస గి॥

(75)

బ్యాండుస్వరము—ఏకతాళము.

మంగళారతీ, మంగాళాకృతి! శ్రీసుకృతీ!
   గంగాధరుని ప్రియాంగనామణి
   రంగత్కృపఁగొనవే, వే
   దేవి! శుభావహా, శ్రీవర భావుకపాదా!
   నిన్నే నమ్మితిగాదా, నన్నేలంగృపరాదా
   సన్నుతా! యిదిశాదా గ్రన్నంగైకొనరాదా
   సారావహితా! జగదధినేతా!
   నారసాంబికా వినుతా! మం॥

(76)

చక్రవాకరాగము—ఆదితాళము.

మంగళమమ్మా గయికొమ్మా! నీకిదేజయ మం॥

1. పొంగుచునొసంగెదను శుభాంగిదేవి! మంగళాలయ! మం॥
2. మీరు కరుణ్రశితవారములనుగని
   సారెకుశుభములఁగూరుచు శ్రీసతి! మం॥
3. కరుణారసభరణా! శుభచరణ! వికారశూన్యా! గుణధన్యా!
   మేరుధీర! నగకుమారి! శుభకరి!
   నారసాంబికావనీ! మనవివిని మం॥

(77)

బ్యాండుస్వరము—త్రిశ్రజాతిలఘువుతాళము.

హారతినిగొనంగదే మేరుధీర నీకిదే జయ హా॥
1. వరపావనీ! నిరపాయినీ! వరదాయినీ! జననీ
   భావాతీత! దేవప్రణుతపదయుతా! జయ॥
2. పరమేశ్వరీ! వరశ్రీకరీ! కరుణాకరీ! గౌరీ!
   నారసాంబికావన! వరఘనగుణా! జయ॥

(78)

కమాచిరాగము—త్రిశ్రజాతిలఘువుతాళము.

వారిజారిధారిణి! జయ, హారతింగొనంగదే
   మేరుధీర! నీపదములఁజేరి భక్తిఁగొల్చెదర వా॥
1. అగమాంతరూపిణి! కరు, ణాపయోధి! ధీనిధీ!
   భోగిభూషణీ! కరుణప్ర, పూత భక్తతోషణీ! వా॥
2. సాధులోకవాసిని! శుభ, సత్కళావిభాసినీ!
   మోదజాలకారణీ! ప్ర, పూతసద్విహారిణీ! వా॥

3. నారసాంబికాహృదయ సు, సీరజోద్భవాలయా!
ధారుణీధరేంద్రతనయ! మారవైరి సత్ప్రియా! వా॥

(79)

ముఖారిరాగము—ఆదితాళము.

(మంగాళారతియీయారె, పలె)

రంగనిశుభాంగి! సుకృతీ! మంగళారతి
సంగతదయాపాంగా! నీకొ, సంగెదనుగొనుమా రం॥

1. గారవంబుమీరభక్త, వారములకిరుణా
సారెబ్రోచుసత్కటాక్ష, జాలములగనుమా రం॥

2. వారిజభవాదివిబుధ, వందితచరణా!
సారాచారాభరణా! కరుణ, మీరెదననుమా రం॥

3. చారుసుగుణాకారిణీ! స, జ్జనవిహారిణీ!
నారసాంబికావనీ! యీ, కోరికనువినుమా రం॥

(80)

బేగడరాగము—ఆదితాళము.

(తనవారితనములేదా, వలె)

మంగళారతి సంగీతవిహృతీ! మం॥
మంగళాకృతీ! యనంగవైరినాతీ! మం॥

1. బృందారకానీక వందితంబులౌనీ
సుందరపాదార విందములకిదే మం॥

2. అంచితగతిం బ్రబ పంచజాలముల
మించుకరుణం బాలించులోకమాత! మం॥

3. కోరికమీరఁగా సారెనిన్ను గొల్తు
నారసాంబికా హృత్సారసవాసినీ! మంగ॥

(81)

హిందూస్థానీతోడి రాగము—త్రిశ్రజాతిలఘువు తాళము.
(రిగమ తేరి హైసనమ్, వలె)

కరుణతోఁ గృపామతీ! గైకొనుమా జయహారతి కరు॥
1. తరుణేందు శేఖరు ప్రియసతీ! ధారుణీ భృద్వరసద్ధృతి!
పరమయోగివిహృతీ! పాయకసల్పెద నేనతీ! కరు॥
2. నతజనకల్పకమీవని నమ్మితి నేకరుణాధునీ!
సతతమున్ ను పావనీ! సాధువన ప్రియసద్వనీ! కరు॥
3. దయనుజూడుజితభయా! దాసావసానగతనయా!
నయగుణాదయామయా! నారసాంబి కాహృదాలయా! కరు॥

(82)

భైరవి రాగము—ఆదితాళము.
(మొరవిని బ్రోవ వేరశరణార్థి సేవధే, వలె)

కరుణించి గైకొనుమా! తరుణేందు శేఖరీ!
పరదాయినీ! భవానీ! గిరిజా! యీహారతీ కరు॥
1. ఎడలేని ప్రేమమున నడరుచు భక్తులఁ
గడలుకొనంగ నేలునీ కడగంటిచూపులఁ గరు॥
2. సతత ప్రమోదరూపా! వితతదయామయా!
నతిసల్పెదన్ సదాస, న్నుతపాదపంకజా! కరు॥
3. వరములొసంగి ప్రోవ, నరయేటి కేయిటు
నరసాంబికా శ్రితావనీ! పరమాదరంబునఁ కరు॥

## (83)

### సురటరాగము—ఆదితాళము.

మంగళాలయా! యీమంగళారతిని
    శుభాంగీ! గైకొనఁగదే    మం॥

1. తరుణకమలసుం, దరముఖ భక్తసం, త్రాణనపరమైశ్రీ
   కరమువిపన్నార్తి, హరమునయిననీ, చరణమునకు వేగ, మం॥
2. కలిమిచెలువయున్, బలుకుచానయి, గ్గడలను జెలువ్రొంద
   నలరిప్రసన్నాత్మ, వైయిటుకనివేవెలయుకరుణతోఁడ, మం॥
3. వెయివిధములని, న్వేఁడుకుమారిని, వీడఁగఁదగవగు నే
   దయనరసాంబాహ్వ, దయనిలయ! దయామయ! ప్రి
   యమలరారన్    మం॥

## (84)

### కీరవాణిరాగము—రూపకతాళము.

(వరములొసఁగి ప్రోచుట, వలె)

సరగునఁగృపగైకొనుమా! జయహారతి దేదేవి!    సర॥
గిరివరతనయా! సదయా! రీ, దగ్గిజేరిశ్రీకరి!    సర॥
నిరతనుజన వేద్యమై, సురమునిగణ సేవిత
    మై, వరమహిమాన్వితమైశ్రీ కరముపద
    మపావనమై, గురుశరణ్యమైతగునీ, చర
    ణాబ్జాతమునకునా, దరమెసఁగ నొసంగు
    చుంటి నరసాంబావినుతసునామా!    సర॥

## (85)

కమాచిరాగము—ఆదితాళము.

ధారుణీదరసుత! హారతినందుము,
నారెకునిన్నే మదిఁ గోరినుతించెదను ధా॥

1. శ్రీకరమైననీదు, ప్రాకటాలోకన
మోక్షపానిధీ! యిటు, సోకఁగఁజేసిదయ ధా॥

2. ఆదికారణమగు, నీనుపదంబునే
మోదమునహృదయ, వీధినినిల్పితిని ధా॥

3. నారసాంబికానుతా! భూరికృపాయుతా!
వేరుసేయకనీకు, మారిమనవివిని ధా॥

## (86)

బ్యాహాగ్ రాగము—ఆటతాళము.

(శాంతిసుఖమే అచలరహాకే, వలె)

హారతినిగైకొనవెనుకృతీ! యతులసత్కృతీ!
అతుల ... అతుల ... అతుల ... అతుల ... హా॥

1. వారిభవసంభవనుతపదా! సారసత్ప్రదా!
సార ... సార ... సార ... సార ... హా॥

2. పాయకిటునిఁగాలుతుజననీ! పరమపావనీ
పరమ ... పరమ ... పరమ ... పరమ ... హా॥

3. నారసాంబాహృదయనిలయా! సారసాలయా!
సారసా ... సార ... సార ... సా ... హా॥

## (87)

### నవరోజు రాగము—ఆదితాళము.

(అతులశుభకృతీ !, వలె)

మంగళాలయా ! శు భాంగి ! హరిప్రియా !
మంగళారతిం గనుంగొ నంగదే దయ ! మం॥

1. ఆదికారణీ ! ప్ర మోదరూపిణీ !
సాధుహృదయచారిణీ ! ప్ర, సన్నధారిణీ ! మం॥

2. పాలజలధిజా ! ద యాలవాలమా !
జాలమేల నీకుమారి నేలుకొనఁగదే మం॥

3. నారసాంబికాహృ త్సారసాలయా !
చేరికొల్తుజనని ! నీప దారవిందముల్ మం॥

## (88)

### మాళవగౌళరాగము—ఆదితాళము.

(శ్రీకమలాయతదళనయనే, వలె)

ఈజయహారతి దయగొనుమా ! నగకుమారి శ్రీకరి ఈ॥
శ్రీపావని సద్రూపిణి జగముల్ప్రాపయిన
పాదమునకొసంగెద నీజ॥

1. నతజనావనినీవనిబుధ, తతివినుతింపఁగసతతమువిందును
మతినీపదములేనమ్మితి, సుతనేలజాలమేలసత్కృపానిధి! ఈ॥

2. సూరివినుతపద నీరజ ! నీకిదె కోరియిడుదు
నారసాంబికావనీ ! కూరిమినినీతనయ వినతుల గొనుము
కృపానిధీ ! సుగుణాంబుధి ! ఈ॥

## (89)

### హిందూస్థానీ కాఫీ రాగము—ఆదితాళము.

(రంగని రాణీ మంగళారతిగొనుమా, వలె)

త్రినయనుని, దేవి ! నీకిదేహారతి — త్రి॥

1. శ్రీపరమేశ్వరీ ! స, ద్రూపిణీ! నీకృపఁ
   జూపి వేగమగొనుమా — త్రి॥

2. భావుకపదయుత ! కోవిదసన్నుత !
   దేవదేవాదిప్రణుత !

3. కోరిపావనివని, నారసాంబికావనీ !
   చేరికొల్తునెజననీ ! — త్రి॥

## (90)

### మాయామాళవిగౌళ రాగము—ఆదితాళము,

(హారతిగొనఁగదె! ఓమారతిరోహితు, వలె)

మంగళహారతిదే, నేఁబొంగారుభక్తినె
   సంగెదఁగొనఁగదె — మం॥

1. రంగుగశ్రీలనె, సంగుతల్లివని
   మంగళాలయనీకొ, సంగెదఁగొనఁగదె — మం॥

2. అనవరతముశ్రిత, జనములమనముల
   దనరారునీపాద, వనజాతములకును — మం॥

3. కరుణనుసుతనేల, నరయజాలమదేల
   నరసాంబికాపాల !, నిరతావనశీల ! — మం॥

## (91)

బేహాగ్ రాగము—ఆదితాళము.

(మంగళారతినిగనుంగొనుజననీ, వలె)

హారతిగిరివరకుమారి! శుభాకృతి!
కూరిమిమీరఁగైకోవె కృపామతి! హా॥

1. అంధకరిపుప్రియ, సుందరి! నీపదార
విందములనునా, డెందమునఁనిల్పితి హా॥

2. వందనమిదెసుగ, వందితపద! యా
నందమయీ! తరుణేందువిభూషణీ! హా॥

3. వారనిభక్తినినుఁ గోరినుతించెదను
నారసాంబికావని చేరియభయమిడి హా॥

## (92)

హిందూస్థానీతోడిరాగము—ఆదితాళము.

(పూసెవాలా మొరతాహజనీ, వలె)

కయికో వెజయహారతి, కయికో వైజయహారతి 7॥

1. ఎంతనినీగుణ సంతతినెంతును,
దంతివరదుప్రియకాంతామణీ! 7॥

2. ఏతరిసిరులిడు నేతవనుచునినుఁ
బ్రీతిమెయినినతి నేతుఁగదే 7॥

3. సారెకుఁగొలిచెద నారసాంబికానుత!
చేరి వేగమొకృప మీఱఁగను 7॥

## (93)

### హిందూస్థానీ కాఫీ రాగము—రూపక తాళము.

(జయమంగళంబొసంగదటో చంద్రశేఖరీ, వలె)

కరుణించిస్వీకరింపుమనూ్మ! గిరిజా! హారతి
చరితాంఘ్రికమలయుగళ! నీకై సల్పెదనునతి క॥

1. వరదాయినీ! భవాని! నేనీ చరణములసదా
నెఱనమ్మితినిప్రసన్నవగుము! పరమపావనీ! క॥

2. అకలంకహృదయలోకవిదితా! సకలశోభిత!
సుకవీంద్రవందితా! ధీయుతా! ప్రకటభాసిత! క॥

3. అరయేలదాసలోకపాలా! వరసుగుణలోలా!
వరసాంబికావనానుశీలా! పరగునను౯జాల క॥

## (94)

### ధీరశంకరాభరణరాగము—రూపక తాళము.

(గతమోహాశ్రితపాలా, వలె)

నయలోకాభయదా! యీజయహారతిగొనుమా
రయమారఁగనయదాసనిచయ! నీదయఁగనుమా! న॥

1. వరభక్తసుకర! పాలితసురసజ్జననికరా! న॥

2. బృందారకవందిత! బుధమందారమ! యుమా! న॥

3. గురుధీయుత! తరుణాన్విత! నరసాంబావినుతా! న॥

(95)

జంఝూటిరాగము—రూపకతాళము.

(గౌరి కరుణమీరఁగ జయహారతిగొనుమా, వలె)

మంగళారతిగైకొనుమిదె, రంగనితరుణీ!
రంగనితరుణి యిదే, రంగని ... మం॥

1. సిరులనొసఁగి భక్తవరుల, నరయుమువుగదే
అరయుమువుగదే సదా, అరయు ... మం॥

2. నరగుననుగుమారిమనవి, కరుణవినఁగదే
కరుణవినఁగదే యిదే, కరుణ ... మం॥

3. నరసమాంబికాహృదయనిలయ! వరములిడఁగదే
వరములిడఁగదే కృప, వరము ... మం॥

(96)

బేహాగ్ రాగము—అటతాళము.

(మంగళంబిదె మహిాత్మ గైకోఁగదె, వలె)

శ్రీసతి! ప్రీతిఁజేరియిడుహారతి! జేరియిడుదుహారతీ శ్రీ॥

1. కయికొనెకరుణామయ! శుభచరణా
నయసుగుణా భరణా! శ్రీ॥

2. వడినాశ్రితలకుం, గడుదయసిరుల
నిడుతల్లివీవంచునే శ్రీ॥

3. వరమిడుమా! సు, స్థిరకృపఁగనుమా
నరసాంబాపాలా! యుమా! శ్రీ॥

(97)

హిందూస్థానీతోడి రాగము—ఆదితాళము.

(గౌరికళ్యాణ వైభోగమే సుకుమారి కరుణనీ హారతి, వలె)

మంగళహారతి రంగని సతి! శుభాంగ! దయామతి! సుకృతీ!
శృంగారాకృతి! మంగళవతి! సు, మృంగఁగనుము
నతి, సల్పెద భంగరహితవిహృతి! మం॥

1. శీతకిరణుసహజాత! దయాపరి, పూత! సుధాంబుధిజాతా!
ఏతరినిను నాచేతమునను సం, ప్రీతిఁగొలుతు నేతా!
గైకొనవేతగఁ బ్రియమాతా! మం॥

2. కోరితిసీరజవైరి విభూషణా, నారసాంబికానతచరణా!
దారిద్ర్యాంధవిదారణనిపుణ! సు, తారణ!
నుతసుగుణా! వేగమ చేరిగొనుముకరుణ మం॥

(98)

కీరవాణి రాగము—త్రిశ్రజాతిలఘువుతాళము.

(మంగళహారతి రంగని తరుణి, వలె)

మంగళాకృతి! సతి! మంగళహారతి
పొంగారుభక్తినో, సంగ్రహింగొనుమా! మం॥

1. పరమేశ్వరి! శశి, ధరశేఖరి! శ్రితని
కరశ్రీకరి! కరుణా, కరి! వరగౌరి! మం॥

2. దేవి! శ్రీపావనీ! దేవదేవాదిసం
భావితపద! వర, మీవేదయాబ్ధి! మం॥

3. నారసాంబికాహృ, త్సారసనిలయా! మో
కారుణ్యమయ! దయమీరఁగఁగనుమా! మం॥

## (99)

### హిందూస్థానీతోడిరాగము—రూపకతాళము.

(మంగళారతి శుభాంగిగైకొను, వలె)

హారతిసతీ! కృ, పారసాకృతీ
 కొఱతినిగైకొనవె వి, కారసంహృతీ! హా॥

1. ఇందుభూషణీ! య, మందతోషిణీ
 అంధకసంహారుప్రియ, సుందరీమణీ! హా॥

2. ఆదికారణీ! ప్ర, బోధరూపిణీ!
 మోదమునంగొల్తుఁగృప, రావెధీమణీ! హా॥

3. సారగుణచయా! పి, దూరితభయా!
 నారసాంబికాహృదయ, సారసాలయా! హా॥

## (100)

### సురటరాగము—ఆదితాళము.

(నీనామరూపములకు, వలె)

శ్రీకరీ! దేవి! గౌరీ! నీకుజయమంగళమ్

1. అతులసౌభాగ్యములా, శ్రితలకొసంగుతల్లి! శ్రీ॥
2. భక్తులచిత్తసీమ, బాయఁజాలనితల్లి! శ్రీ॥
3. నారసాంబావనవి, శారదవైనతల్లి! శ్రీ॥

మంగళహారతులు.

సంపూర్ణము.